శ్రీ

సద్గురు పరబ్రహ్మణే నమః

:O:

ముముక్షుజనానుకూలమగు

# శ్రీ సోమధర నామావళీ.

తత్త్వార్థకీర్తనలు.

బందరు రాజపురీనివాసియు శ్రీసదాశివపాదారవింద
సేవానిరతుఁడునగు
కామర్తి సుబ్బయ్యదాసుచే రచియింపఁబడి
శ్రీమదద్భుతోత్తర రామాయణాద్యనేకగ్రంథ[illegible]
చతుర్విధకవితాసామ్రాజ్యులునగు బ్రహ్మశ్రీ
నాదెళ్ల పురుషోత్తమకవిగారిచే
పరిష్కరింపఁబడి

వ॥ వ॥ స॥ ఓవర్సీయరు,
కామర్తి వేంకటసుబ్బయ్యగారిచే
అమలాపురం
శ్రీశర్వాణీముద్రాక్షరశాలయందు ముద్రాయితమై
తన్ముద్రాలయాధికారి పేరి వేంకటేశ్వరశర్మగారిచే
ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 1,000.

వెల రు. 0—1—0.

1909.

ఓం.




——:o:——

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీపరమేశ్వర చరణారవింద మకరంద పానానంద తుందిలమానసేందిందిరుండును బందరు రాజుపేట కాపురస్థుండును బ్రహ్మశ్రీ పండితారాధ్యుల ఆంజనేయ్యవార్లగారి శిష్యుండును ముక్తిసాంప్రదాయ కార్యక్షత్రియవంశజుండును శౌనకస గోత్రుండును కామిశెట్టి లక్ష్మీదేవి పట్టాభిరామపుత్రుండునగు సుబ్బయ్యదాసుచే ముముక్షుజనానుకూలముగ రచియింపబడిన సోమధరనామావళి. శ్రీమదధ్యాత్మరామాయణాద్యనేక గ్రంథకర్తలును, చతుర్విధకవితాసామ్రాజ్యులునగు బ్రహ్మశ్రీ నాదెళ్ళ పురుషోత్తమకవిగారిచే పరిష్కరింపబడి స|| వ|| టి|| స|| ఓవర్సీయరు కామిశెట్టి వెంకటసుబ్బయ్యగారిచే ప్రకటింపబడెను.

——:o:——

# విషయసూచిక.

## సోమధర నామావళి.

———:o:———



———:o:———



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసరస్వతీదేవిసహాయము.

శ్రీసద్గురుపరబ్రహ్మణేనమః.

# సోమధరనామావళీ కీర్తనలు.



## శ్రీగజానన స్తవము.

కళ్యాణి రాగం—అటతాళము.

(1) శ్రీ పార్వతీతనయా- తలతునుహృది- కాపాడుమప్ర
సీదయా॥ పల్లవి॥ శ్రీపతినుతనీ- ప్రాపుగోరితినా- పాపములనుబా
పు నీపాదములపడితి॥ శ్రీ॥ లక్షణామెరుగనయ్యా - సాధుసం-
రక్షకానను బ్రోవరా। లక్ష్యములోనున్న-అక్షయనందన- శ్రీ॥

కోరితి ను-లక్ష్మణా మెుసగుము ॥ శ్రీ॥ బృందారకచింత్యనామా - నా యందునీవే పరంధామా । అందమౌనీమూర్తి-యందెనామదినిడితి-ఆ నందముగబ్రోవు-సానందాబ్ధిశయనన్నా ॥ శ్రీ ॥ నీపముననిన్నాద రించితి - సోమధర-నామావళిగూర్చితి । నామమీ కామక్షి -సుబ్బయ్య నేలు ప్రేమారసనుజిమ్ము యేమితెలియదునమ్ము ॥ శ్రీపార్వతీ॥

కళ్యాణి రాగం—ఆటతాళం.

(2) దేవీనన్నుబ్రోవవె- శ్రీ వాణి- శివానన్నుగావవె ॥ పల్లవి॥ దేవీనన్నుబ్రోవు- దేవాదిదేవనుత- భావాములోనని- సేవజేయుదుత ల్లీ ॥ దే ॥ సేవాసేయుచునుంటి- తల్లీనన్నా-గావుమంటినికనకావ ట్టీ । సావధానముగ-నన్నుతులనువిని- కావబూనకున్న- గతినా కింకెవరమ్మ ॥ దే ॥ వందానామునీకు ముందుగా- నీకృప చందన ముగునాకు పొందుగా। కుందారదననా వాక్ర్యందున వెలయుమ-వం దనములిడు-సుబ్బయదాసునేలు ॥ దేవీననుబ్రోవవే ॥

గౌరీస్తవం కందార్థము.

శంకరాభరణము—ఆటతాళం.

(3) వందనమమ్మాగౌరీ । పొందుగనీపాదములకు పొలుప గుభక్తిన్ । వందనములాచరింతును । వందారుమునీంద్రవంద్య - చందానమమ్మా-నీకృపమాకు-చందానమమ్మా - కుందరదన పూర్ణేం దునిభానన - చందానగంధి నా-యందు నీదయయుంచుమా॥ వం॥

ఇష్టదేవతా ప్రార్థన.

నాదనామక్రియ రాగం—త్రిపుటతాళం.

(4) గౌరీదేవికి శరణు - కాళీదేవికి శరణు శ్రీరమాదే వికి శ్రీవాణిదేవికి - శరణు ॥ శివనవదుర్గాంబకు ఘనశ్యామలాం బకు । మననిజజననికి మహాలక్ష్మిదేవికి - శరణు ॥ కొల్లాపురమ్మకు

## కీర్తనల ప్రారంభం.

### అసావేరి రాగం—అటతాళం.

(7) బుద్ధికుదిరి వేడినాను-యితర-సుద్దులంటా లేదు నేను॥ త॥ బుద్ధికుదిరిముద్దూ పూబోణి వేడితి। హద్దూలోనిలచీనను సిద్ధాని జేయు మంటి॥ బు॥ గురువులెందరయినాను నాకు గురుతుజెప్పిన దెవ్వా రూ। గుర్తుతూజెప్పనివారు గురువులయ్యేరా గురుతూజెప్పిన గురు వు గురితప్పాకన్నిచెప్పె॥ బు॥ గురువులమేమానుచువిజ్ఞ వీగి - విరివి గానుతిరుగుచురూ। అరువోరొఖాక్రేమో అసలేదోయెరుగారూ యి రువుజెప్పానివారు గురువులరాయ్యే॥ బు॥ కుచ్చితగుణమున్న గురువా- అహము- వచ్చిన వాడెవరో గురువు। తెచ్చినాదేదో వ చ్చినాదేదో కుచ్చితాముడిగితే వచ్చూదెగిపోనూ॥ బు॥ కామ క్రోధలోభాదుల-కాల్చి- సాధుగాన ముచేయగాను। సోమధరుడునా పయి ప్రేమరసముజిమ్మి స్వామియైరేరెను కామర్శి సుబ్బయ్యను॥ బుద్ధికుదిరి వేడినాను॥

### నాదనామక్రియ రాగం—అటతాళం.

(8) యేతీరుభజియించినానో- ఆ తీరానాతికెఱుక। య॥ నాతీరుతెలియాక కోతూలా కూరూలు చేతగాకనన్ను యేతీరాడి తెనేమి॥ యే॥ శక్తిసత్తువధారబోసి నే రిక్తుడనయి క్రొంగి క్రి నాను। ముక్తిజెప్పమాని శక్తినివేడితే భక్తితోనుందుకు ముక్తి కలుగునని॥ యే॥ పెద్దాలకు సిద్ధాలకు-మంచి- బుద్ధిమంతులకువిన తి। ఉద్దా మొద్దూలగుచు గద్దరితుంటరులు హద్దుమీరినన్ను శద్ది చేయుదురు॥ యే॥ తప్పూలుదిద్దావమ్మా - తల్లీ - ఒప్పూగాన మ్మతికొమ్మా। తొంపూదునీసేవ గొప్పాగజేస్తేద। తప్పక సుబ్బ య్య దాసు నేలవమ్మా॥ యేతీరు॥

రేగుప్తిరాగం—అటతాళం.

(9) తప్పులుదిద్దేమని యీజగములో గొప్పగజెప్పెదరు। ప॥ తప్పయేమున్నది - తనువెత్తితప్పగా - తనతప్పదెలియక - నా తప్పదిద్దగా ॥ తప్ప ॥ తప్పున్నదాభక్తికి - ఒప్పున్నదీముక్తికి - తప్పున్న నేమిసద్భక్తి తక్కువగునా తప్పతెలియనివారు నను తప్పలనతగున॥ తప్ప ॥ ఏలావచ్చేనజ్ఞానము అనుచు చాలా హేళనా జేయుదురు కాలాయమునిచేత కష్టము లెరుగరు తాలిమియుంచేను హేళనాదెలుసును। తప్ప ॥ చదువురాదనికొందరు-చదువకున్న- కవియేమనికొందరు। చదువుదెలిసినవారు పెద్దాలు శిద్ధాలుచదువక్కరాపెరుగరు యెద్దూలు మొద్దూలు॥ తప్పులు ॥ కామగా ద్దెలకబ్బునా సోమధరునీనామము। సామగానముచేసి స్వామినివేడినా ప్రేమరసముఁజిమ్ము। స్వామిసుబ్బయ్యనేలు॥ తప్పులు॥

రేగుప్తిరాగం—ఆటతాళం.

(10) నీతిజెప్పినవినవు-కోతి నీ-ప్రాతేమో చేతగాదే॥ పల్లవి॥ నీతిజెప్పినవినవు ఖ్యాతిగానేనివుడు నాతినీవీతిరు నడువగాతగదని ॥ నీతి ॥ నిత్యానిత్యము దెల్పితి యీ యుత్సాహ మెందుకంటి। నిత్యానిత్యముదెల్పితి సత్యస్వరూపము బ్రహ్మమేనిత్యము సర్వమూనిత్యమని ॥ నీతి ॥ మాటాలువినావుగా నీకు మూటాలుగాతాలెగా। తోటలోనున్నావి వాటమైతెపో స్వాతోటిరాబోకు నీయబ్బతోటిపో ॥ నీతి ॥ కామబంధములోనుజిక్కి - నీ- వేమూరుఖామలకుప్రాముకేక్కు। కామగాదిదెని దిక్కెవ్వరులేరు ప్రేమసుబ్బయజెప్పె సోమధరునకుమ్రొక్కు ॥ నీతి ॥

నాథనామక్రియారాగం—అటతాళము.

(11) బుద్ధితెచ్చుకుబ్రతుకుజీవా యీ రద్దినీకేలా। పల్లవి।

హస్తములకె యెత్తుముద్దుకలెత్తిరిగిన బుద్ధిహీనులయమునుడుగుద్దిజం పేసు। బుద్ధి॥ తనువునిత్యముగాదోయన్న-యింకా తనువేనిత్యమయితే। తనకెంతపొగరో। తనువునిత్యముకాదు ధనమూ సత్యముగాదు తనకు మెవ్వరు లేరు తన వారెవ్వరుగారు॥ బుద్ధితెచ్చుకు॥ శివభక్తులనుదిట్టబోకు భవవ్యాధులనుజిక్కి బాధానొందేవు। దవనహ్ని మాదిరి ర్పామణచలేవా ఆవలయముడు నిన్నుగాచెను చూడు॥ బుద్ధి॥ మరచినిదురబోకుజీవా తరచిసుబ్బయ్యదాసు డెరిగించెత్రోవ తెలిసుడ్కొర్గను వేమారంటకుజీవా సరగునసోమధరునినమ్మ్రజీవా॥ బుద్ధి॥

రేగుప్తి రాగం—ఆటతాళం.

(12) ఆహాహాయేమన్నది - చోద్యము - దేహములోగనుమన్నది॥ ప॥ దేహమెవ్వరో దేహియెవ్వరో దేహమున్నుండగానే దేహినిగనుమన్న॥ ఆహాహా॥ కామక్రోధలోభములు- కాల్చి-నామగానము జేయుమన్నది। సోమధరునినామం-ప్రేమతో నొసగెను, భామాభక్తులసొమ్ము ప్రేమా వతినన్నది॥ ఆహాహా॥ యక్షగంధర్వకిన్నరులు సిద్ధేపయూర్తి నక్షయుని వేడెను। రక్షామనుచూపే- వత్తు రాగ్రము నగడునిక్షేపమైయున్న, సాక్షిభూతంబౌకతె॥ ఆహాహా॥ తంత్ర నాట్యము జేయుచూ- అప్పుడు-కుంభహారతులిస్తూను। అంబాజగదాంబ - ఆదరించుమని అంగాలాపరాపా - నానందముగచూచె॥ ఆహాహా॥ సురులుగానము చేయుచూ - వరుసీ-సతిని వరమివ్వమని వేడిరీ సరణిజాడునుని - వరములొసగిదేవి - వరసుతుడౌసుబ్బయ్య - వారుకొనవనియించె॥ ఆహాహాయేమన్నది॥

అసావేరి రాగం-ఆటతాళము.

(13) చెలగానివెతలయా - నాకిప్రాతా తేదుకలేదా।ప॥

మాతామాటలనమ్మ యేతీరాడితెనేమి- నాతివాణికృప నాత్రాతఫలము॥ చేత ॥ యేతీరుభజియించినానో - ఆతీరు దేవి కేయెరుక। నా తీరు దెలియక యీతీరుమాటలు కోతూలకబ్బునా నీలిజ్ఞానరసము॥ చేత ॥ ధాతాత్రాసినవ్రాలు- బ్రహ్మవేత్తాలకయినసరీరా। ఖ్యాతివంతులకయినా - వ్రాతాదప్పలేదూ- చేతాతుడువలేరా- సీతాదేవికయినా ॥ చేత ॥ సోమధరునినామము - మిగుల-ప్రేమతోనమ్మి యుంటి। సామాన్యోలుడు నాపయి- ప్రేమారసము జిమ్మి - యీమహిసుబ్బయ్య - దాసుతానైయుండె ॥ చేతగానీతెధవలూ ॥

రేగుప్తి రాగం—ఆటతాళం.

(14) అమ్మానెవ్వరెరుగరూ- భక్తుల సౌమ్యయున్నాదిసుమ్మా ॥ ప॥అమ్మానెరనమ్మిన- జిమ్మపాదామృతము- సమ్మతిగాను నానిర్మలవాక్కున॥ అమ్మా ॥ వాణీదేవిమాయమ్మా- అలవేణిదేవిమాయమ్మా । పాణీలోవాణీ-పాదాముబట్టితి పాదాంగుష్ఠరసము పానాము జేసితి ॥ అమ్మా ॥ యెవ్వరేమన్నానేమి- తప్పకయెవరి-కి ర్త వారికెనసుకొంటి। అవ్వాలనున్నాది అమ్మానునమ్మిన యెవ్వారేమన్నా నాకేమిభయమన్నా॥ అమ్మా॥ సోమధరప్రార్థిత- పావనకిర-నామావళి శోభితా । కామన్ని సుబ్బయ్య ప్రేమతోవేడిన అమహాత్యను జూపె- ప్రేమతోవినుడీ॥ అమ్మా ॥

నాదనామక్రియ — ఆదితాళం.

(15) శివనామమె జీవనముజీవ - అవనిలోన వేరాదరవేది శివనామమెజీవనముజీవ॥ ప ॥ భవరోగంబులు బాగుగనొట్టి భావజవైరిని పాదముబట్టి ॥ శివనామమె॥ రేపూమాయా మాపూమామాకాపురికరణం అంతామాయా రూపులన్నియు రూఢిగమాయా రేపోమాపో యెనుడూకాయా ॥ శివనామమె ॥ సంసారముమాయా

దేహమునీవాయా యీవాహ్రత్తోవలు అన్నియునీవాయా సోహంబనవు భావమందున దేహినెరుగవు నీమత్స్వామాయా॥ శివనామము॥ పెద్దలుపాయా సిద్ధులుపాయా బుద్ధిమంతులకు పుణ్యంబాయా హద్దుమీరినయెద్దుమొద్దులకు కామబద్ధులకు- కర్మంబాయా॥ శివనామము॥ రోగివాయా - రోగంవాయా - సాగిసాగిసజ్జనవాయా ఆగము భోగము- కొంపెహ్వవాయా- యీదలేకవాని-మత్స్వామాయా॥ శివనామము॥ కాలుడువ్వాయా- శూలుడువాయా- మారునినదశలుఅన్నియువాయా పాలనచేసే ప్రభువువాయా- అలిముండదానిమత్స్వాయా॥ శివనామము॥ తనువువాయా- ధనమూవాయా- తనువుయందున- తలపులువాయా తనువునూధనములు భారబోయ్యవు అణువుతెలియవు నీమత్స్వామాయా॥ శివనామము॥ నేనూవాయా నీవూవాయా నీనాసందున నామము కాయా నేనునీవనే యెరుకవాయా నెరుకలేకనీమత్స్వామాయా॥ శివనామము॥ పెరుగూవాయా- తరుగూవాయా- అరువురోఖం అంతావాయా యిరువునపెద్దలనడుగజాలక- మడుగునబడితివి మత్స్వామాయా॥ శివనామము। కామమువాయా- క్రోధమువాయా- కామర్ధి సుబ్బయకుపాయా- సోమధరా నీనామము కాయా- స్వామిభక్తులకు భాగ్యంబాయా॥ శివనామము।

కాంబోదుస్వరం—ఝంపతాళం

(16) బాలత్రిపురసుందరీ చాలవేడితిశివధరీ॥ ప॥ శైలాత్మజని సుందరీ- జాలమేలభక్తశుభకరీ॥ బాల। శైలభాగమంద్దునా సీలజ్యోతులసంద్దునా-వాలలాడుచుఅందునా సుశీలచాలవేడితి॥ బాల॥ చంద్రధరునిసతీ - సుందరి తాతాద్రితతి- కుందరదన - పార్వతీ వందనముసుభావతీ॥ బాల॥ మెరుపు తెలుపునలుపులోన తెరపిగామయుంటివమ్మ। మరవు తెరపుత్రుంచవమ్మ- పరముసొసగుకొమ్మ

పాల ॥ మరిమరినామొరవినుమని - పారిపహొదరి ప్రేమతో - సుబ్బయ్య- కరుణజూడు గురునిసతి- హైమవతి పార్వతి। బాల్యత్రిపుర సుందరి।

హిందూస్తానీ—తోడి—అటతాళం

(17) అర్ధాము తెలియండి-నన్ను-నిర్దయ గాజూడకండి॥ప॥ వ్యర్థము కాదు పరిశుద్ధావాక్యములివ్వి। పెద్దాలచే గ్రంథఅర్ధాము తెలియండి। అర్ధాము॥ శుద్ధాత్మ నేవేడినాను-నన్ను సిద్ధానిచేయుమ నుచూ హద్దులోనిలిచితే ముద్దువాక్యముచెప్పె। పెద్దాలకేగాని మొద్దులాకే మెరుకా। అర్ధాము ॥ సామగానలోలాని - నేను-ప్రేమ తో భజియింతు వీలుగ। కామర్షి సుబ్బయ్య ప్రేమతో జెప్పిన సోమా ధరునిదివ్య- నామకీర్తనలు। అర్ధాము తెలియాండి॥

రేగుప్తిరాగం—అటతాళం

(18) పెక్కు-చదువులూచదివినా-నిక్కు-లెగాని- నిక్కొ- మెవ్వరుగన్నారు॥ ప॥ అరాకు-విల్తునితేజం మకాకు-లకందునా మక్కు-వాప్రేమాలు మిక్కు-టముయితేను। చక్కు-నీనాసాగ్రమందు న పెక్కు-బెట్టి నిక్కి-చూచి మక్కు-వాతో సొక్కు-తీరున మిక్కు- టపు- చూపయి తెజిక్కు-॥ పెక్కు-॥ అర్ధాము మెరిగిన పెద్దలు- నన్ను- నిర్దయాగాజూడరూ। వ్యర్థాము కాదు పరిశుద్ధావాక్యములివ్వి పెద్దాలకేగాని మొద్దూలకే మెరుకా। యెద్దు మొద్దువలెను యెన్నా శృంగబతికిన ఫలము లేదు హద్దులోనిలుచుండి గురువద్దనున్న సిద్ధాల పురుదు॥ పెక్కు-॥ కామక్రోధాలోభములూ- ఛీఛీ- విడువుప్రేమా తిశయములూ। సామాగానముచే సద్గాతిచెప్పెను- ఆమహాత్మునిజూ డు- ప్రేమారసముచిమ్మ్ము। కామర్షి సుబ్బయ్యచెప్పిన- నీమాముద ప్పాకయుండూ। ప్రేమతో నామంభునమ్మిన సోమధరుడే సాక్షియైత గు॥ పెక్కు-వదువులు॥

ఝంజూటిరాగం—ఝంపతాళం

(19) సోమధరా- భీమేశ్వర - ప్రేమజూడరా- సామగానలోలా సుశీలబ్రోవరా। పల్లవి॥ కామవయిరి రామసుతా సౌవమిఅజమిత్రా। ప్రేమతోను వేడినాను పరమపవిత్రా। సోమ॥ వేమారాడక నన్నిపూర్తుబ్రోవరా పామరుడను పాపిని పరంధామగావరా। సోమ॥ నందివాహన ఇందురార అందముగాను। వందన మొసగెను సుబ్బయ్యకందము చూపు। సోమ॥

రేగుప్తి—ఆటతాళం

(20) అంతా తానైనన్నాడు- సోమధరుడు- చింతలుడుగ మన్నాడు॥ ప॥ అంతా తానే నన్నాడు వింతాకనుమన్నాడు। వంతాదీరను గురుని చెంతాగనుమన్నాడు॥ అంతా॥ అండాపిండాండంబులు బ్రహ్మాండమున నిండి వెలుగుచున్నాడు। బండాగుణము విడిచి అండాకనుమన్నాడు- కుండాలీస్థానమున నిండియున్నాడ మగో। అంతా॥ సకలలోకములు తానే అఖిలమందు నిర్మలమయి యున్నాడు। అకలంకూనెరుగారు సకలంకూలందరు అతలవితలను తలమహాతలమందున్నాడు॥ అంతా॥ నామాముగనుమన్నాడు- విశ్వలమయి నీమముగనుండుమన్నాడు- సామగానముచే సన్నుతి చెప్పినన్నాడు ప్రేమతో కామషి సుబ్బయ్యరక్షకుడూ॥ అంతా తానైనన్నాడు॥

రేగుప్తిరాగం—ఆటతాళం

(21) చూడారే వేడుకాతో- జేడియలారా- కూడియూ వేళానాతో॥ ప॥ చూడారే వేడుకా నాడిద్వారమునందు- యేడూకోటలమీద- ఆడుచున్నాడు॥ చూడా॥ మాపూర్వ్రం చూపాయానే నేరియ- లోచూపులో ప్రాపాయెనే పూపూలో చూపాయె- చూ

పూరూ పెడమారెు - చూపూరూపాకటారెు సుఖియించితో నారెు॥ చూ॥ అయిన వాడు అత్తాకాడుకూ - కానివాడు పెద్దత్తకాడుకూ - అయినా కాకున్నా మన కేమిలేకున్నా - వయినాయున్నాదు మే నత్తకొడుకునిపొందు ॥ చూ॥ కామక్రోధలోభములు కాల్చి - సామ గానము జెయ్యరె। స్వామిభక్తులకొమ్ము సోమధరునికమ్ము ప్రేమా రసముబిమ్ము - సుబ్బయ్య వాక్యము నమ్ము ॥ చూ॥

రేగుప్తిరాగం—ఆటతాళం.

(22) చకోరదన మెన్నాదరమూ - చెలియపొందుచికోర దెవ్వరికైన వినుమూ॥ ప॥ మకూరజాప్రేమలు మీకూటమయితే ను - వశ్యమయిన వారి ఫలమేమో తెలియాదు చకరీనా సాగ్రమ్మం దున నైకువెట్టి - నికిరూచి మకూరవాతో సుకరీరున మి కరటవు చూపయితే సేమో ॥ చకో॥ వాసనాదులుమూడూ - అన్నలారా - ఆశపాశములయిదూ - వానిగుణము చేత కూపుగుణ ములన్ని - యీకానికృపచేత మూసానూది తే సేవా వానిగలాచి న్నదిని వాసమూగనుమున్నది. ఆశపాశములన్నియుడిగిన దాపు లావరమున్నది॥ చకో॥ పున్నాపువెన్నెలవెలుగులో - కిన్న తంత్రితోసున్నాతముగనున్నది - చెన్నుమీరగాను నన్నూజూ చుటకూ అన్నిచింతలుయుడిగి తిన్నాగగనుమున్నది కన్నవారికో డలన్నది యెన్న రానిచిన్నది నన్నెన్నె వారెవరభునయున్న చిన్నవుతాన్ననన్నది॥ చకో॥ కామక్రోధలోభములు ఛీఛీవిడరె ప్రేమాతిశయములు సామగానము జేసి- స్వామిని వేడరె ప్రేమార సముబిమ్ము స్వామిభక్తులనేలు కామర్షి సుబ్బయ్య జెప్పిన నీమము దప్పకయుండి ప్రేమతో భజియింపుచున్న సోమధరు దేసాక్షియగును॥ చకో॥

బేహాగ్ రాగం—రూపక తాళం.

(23) ముట్టుముట్టుటందురు- ముట్టేమిటో తెల్పవే । ముట్టలేక ముగ్గురన్నలు- మునిగిపోయిరే ॥ ముట్టు ॥ పుట్టిగిట్టు కీలకమ్మ- గుట్టు తెల్పవె । పట్టిమోహము విడువలేక- పుట్టిచత్తురె ॥ ముట్టు । పట్టుబట్టి ముట్టిరేని- గుట్టు తెలియునా । పట్టితి భీనరులు- ముట్టితెన వ్విపోదురే ॥ ముట్టు ॥ పట్టిమోహాలెందుకమ్మా- గుట్టు తెల్పవె యీ పట్టువిడకు- గురునికృపచె గుట్టు తెల్పుదున్ ॥ ముట్టు ॥ ప్రేమమీరనె వరుసాకు- పేరు తెల్పవే । సోమధరుని నామమెం- పేరు సుబ్బయ్యకు ముట్టు ॥

ఆసావేరి రాగం—అట తాళం.

(24) దిక్కులేదంటురు నన్ను- నాదిక్కు సద్గురుడయియున్న ॥ ప ॥ దిక్కులేకయున- గురుదిక్కునయున్నాను । దిక్కు లేనికుక్కు యముదిక్కున్నాడు ॥ దిక్కు ॥ సన్యాసినందురు నన్ను ఆసన్యాస మెరిగితెమి నన్ను- సన్యాసియెవ్వడు । సర్వము తెగిన వాడు- సన్నా ద్వారము మించి- సన్నిధినున్నాడు ॥ ది ॥ అపరాధి న పరాధి నంటినీనా- సేవములన్ని కావుమంటిని- కఫవాతములు గొట్టు- పమోసగుమంటిని- చపలుడనంటిని- కృతజ్ఞడుమంటిని ॥ ది ॥ కామబంధములోనుజిక్కి- యీ భామలకై చాలస్రుక్కి- పామరులగునా సామికి మొక్కరు- ప్రేమసుబ్బయ్య నేలు సోమధరసాక్షి । దిక్కు ॥

రేగుప్తి రాగం—ఆట తాళం.

(25) ఆహాహాయేమన్నాడు - సోమధరుడు దేహములో చోద్యము ॥ప॥ ఊహాతోకలన్ని కట్టివెయిమన్నాడు- సోహంభావము చేత కనవచ్చునన్నాడు ॥ ఆహాహా ॥ అంతర్లక్ష్యమన్నాడు - విడు

వృమీ- తంత్రములనియన్నాడు। మంత్రములు యంత్రములు మహి మగనుమన్నాడు- మంత్రార్థ మెరిగితే మహిమయందన్నాడు॥ ఆహాహా॥ భావలున్నారన్నాడు- భావముల చావగొట్టుమన్నాడు। ఆవలనున్నది- అదిగో భామన్నాడు- భావమందున - దేవిసేవచేయుమన్నాడు॥ ఆహాహా॥ అన్నాలారుగురన్నాడు- కన్నావారి చిన్నాపొయ్యనుంచన్నాడు - కన్నతల్లితోడ నున్నత్తముగనుండు మెన్నరానిజన్మ బాధపడన్నాడు॥ ఆహాహా॥ పరమపతివ్రతమున్నాడు- దానికి- యిరువున పరపురుషయన్నాడు- పురుషులుముట్టలేరు - పరునిలంజన్నాడు- పరపుసల్లాపములు సల్పలేకన్నాడు॥ అహాహా॥ కామక్రోధలోభములు- కాల్చి సామగానము జేయుమన్నాడు- ప్రేమతో స్వామిసద్గతిచెప్పెనన్నాడు- కామప్పి సుబ్బయ్య హృదయమందున్నాడు॥ ఆహాహా॥

బేహాగ్ రాగం—రూపకతాళం.

(26) రమ్మన్నాడు పొమ్మన్నాడు- రమాధారిణిదేనన్నాడు॥ ప॥ కష్టవిత్తునిగుణములంటక- యిమ్మాగనుండుమన్నాడు॥ రమ్మ॥ నాడీతతుల్వయి తేనూ - రూఢీతత్వయెవ్యనా - నాడిరూపజోడుగూడి- గాడిదలనుగొట్టేరా॥ రమ్మ॥ ఏడిరాజగమందున వాడు। రూఢినాకుచెప్పరా - యేడుకోటలపయినావాడు- ఆడుచుండేను జూడరా॥ రమ్మ॥ కామక్రోధలోభము- కాల్చివెయ్యమన్నాడు - ప్రేమతో సుబ్బయ్యచెప్పిన- సీమాలు గనుమన్నాడు॥ రమ్మ

రేగుప్తి రాగం—ఆటతాళం.

(27) తానేతానన్నాడు- సోమధరుడు- తానెవరో గనుమన్నాడు॥ ప॥ తానేతానన్నాడు- తనవులోనున్నాడు- తను

వెతకుతానైనను- తనవారెవరన్నాడు॥ తానే॥ తర్క-వాదముల న్నాడు - నిక్క-ముక్రోధ- ధిక్క-రిపవ్వరికన్నాడు। తర్కించకు నాతో మిక్కటపుప్రేమ- అక్క-విల్తుని తేజమాశ్రయించ న్నాడు ॥ తానే॥ వాసనాదులు మూడు - దేహమను- మూసనూదుమన్నాడు। ఆశపాశములయిదు- కోసుకోమన్నాడు - నానిగుణముచే సద్గతి పొందుమన్నాడు॥ తానే॥ కామక్రోధలోభములు- ధీధీవిడువు - ప్రేమాతిశయములు సామగానముచే సద్గతిచెప్పినన్నాడు - ప్రేమతో కామర్షి సుబ్బయ్యరక్షకుడు ॥ తానే ॥

### బేహాగ్ రాగం—రూపకతాళం.

(23) దేహగేహామందు- నెట్లు మోహముగునే॥ ప॥ యా హాచేత దేహములో దేహినిగనవే ॥ దేహ॥ యీగుణత్రయంబుయు రియెటులతప్పనే। వేషధారులందు వాసన- మూసనూదవే॥ దేహ ఆశపాశమంటిచాల మోసపోతినే। నానిగుణమునంటి సద్గతిని పొందవే ॥ దేహ ॥ పందువెన్నెల బయలులోను యుండెదేలనే - దండిగాను గృహనికృతచే నిండియుండవే॥ దేహ ॥ ప్రేమతోను వేధి తేను హామిమెవ్వరే- సోమధరుని నాము మేహామి సుబ్బయ్యకుహామి దేహ ॥

### నాదనామక్రియ రాగం—అటతాళం

(29) మరచిమరబోకండి- తరచిచెప్పచున్నా - సరది తెలియండి ॥ ప ॥ అరిషడ్వర్గము లేమా రంటాబోకండి। అనవరత ముగురుని - స్మరణచేయండి ॥ మరచి॥ మరువాకామారునైపుడు - స్మరియించుచున్నా- తరియించుచున్నాము- గురునిగనుచున్నా ॥ మరచి॥ మురిచియుండగజూచి- కడచుచున్నముక్కాలు-దిరిలిగా -

గురువరుని స్మరణా జేయుచున్నా॥ మరచి॥ ఆశాపాశములఁ బెందుకో సివేయుచున్నా। వాసనాదులుకూడం- మాసనూదన్నా॥ మరచి॥ నీచదేహము॥ భిభి నిత్యమనుకొన్నారా- సాంచాగుణముచే- శుద్ధలిఁబొందుచున్నా॥ మరచి॥ పామరత్వముతోలగు - సామగానము జేయ- ప్రేమభక్తులకును- స్వామినామమే సాక్షి॥ మరచి॥ కామర్షి సుబ్బయ్యప్రేమతో చెప్పెను- సోమాధరునినామము- ప్రేమతోసమ్మి॥ మరచి॥

బేహాగ్ రాగం—ఝంప్యాతాళం

(30) రాజా రాజేశ్వరా- రాజా సర్వేశ్వరా - తేజమొసగు భూజనసుత - తేజా బిడౌజా॥ రా॥ ॥యాజకములోనన్న బ్రోవు త్రిజగదీశ్వరా - అజరామానుజనుత హార- సుజనపాల భుజగధరా॥ రా॥ భక్తలోకపాలనా రక్షకుఁడను నాయనా - శక్తినొసగు భక్తినొసగు ముక్తినొసగునాయనా॥ రా॥ నీమనిష్టలేమియెరుగ ప్రేమజూడు సోమధరా - కామర్షి వంశదారా సుబ్బయ్య నేలుగురువరా॥ రా॥

బంఝూటి రాగం—ఝంపాతాళం.

(31) వరమువుఁరుష- పార్వతీశ వంతమునాపై- సురనుత వరగురువరదను కరుణజూడరా॥ పల్లవి॥ కల్లతనములెల్ల చాల కర్తనయింతినీ। ఉల్లమందు నీదుసేవ జేయ నయింతిని॥ వరము॥ ఇందుముఖా యెందునీవె ఎరుగనైతిని। ముందుగతులు తెలియలేక మ్రొక్క పోతినీ॥ వరము॥ సోమధరా శ్రీమహేశ్వర ప్రేమజూడరా। నీమనిష్ఠ తెరుగ సుబ్బయ్య నేలుగురువరా॥ వరము॥

రేగుప్తి రాగం—అటతాళం.

(32) విద్యచెప్పమన్నాను నాతల్లి విద్యలెందుకన్నాది॥ పల్లవి॥ విద్యగలవారెల్ల గద్దెలెక్కినారా యీమవిద్యలేనైన వ

రవిద్యకాదనేను॥ విద్యా॥ ఆటగాదికి విద్యలు- కాతలేను- పూటలుగడుపుటకు। కూటామునోచనము కూడియుందామింక - మాటిమాటికినాతో పోట్లాడవద్దనేను॥ విద్య॥ సోమధరునినామావ- ళిమిగుల- ప్రేమతో నుపగనాతల్లి। నామమహాత్మ్యముచే యీమహాత్మ్యములె। నామధేయము సుబ్బయ్య స్వామినే నెంతవాడ॥ విద్యా॥

శ్యామా రాగం—ఆటతాళము.

(33) స్వామిసాంబశివ- సంతోషమాయెను- నామామొనగినస్న। ప్రేమ పూచితివి॥ తల్లవి॥ కామవైరిపరంధామ పరాత్పర నామమహిమనీది యేమహాత్ములకోగా॥ స్వా॥ విద్యాకొండజాయండనీవగుటచే- హృద్యంబనుచునీ। విద్యావేదివిని విద్యారానినాడు ఉత్తరులవేడితి యెవడబ్బసొమ్మియీ విద్యచెప్పటకనిరి॥ సా॥ సామగానలోల స్వామిపరిపాల కామవైరివందనముసుశీల। కామిస్త్రీ సుబ్బయ్య ప్రేమతోనేవేళ నీమాయగావేదు నీవేదికల-నినవిస్త్రి॥ స్వా॥

కేసుప్తిరాగం—ఆటతాళం

(34) ఆనందమాయెనయ్య- నేటికి బ్రహ్మనందమాయెనయ్య॥ ప॥ ఆనందమాయెను సానందార్చితక్రుప - గానముచేసి రసపానముచేసిన॥ ఆనం॥ చావుపుట్టుక లేదు- నేనింకగావుమనుట లేదు- యేపూరేగేదమి మాపూరేగుదునింక - మాపూరెరుగుదుర అవనిలోనెవరయిన॥ ఆనం॥ వాణిదేవిక్రుపచేత - అలివేణిదేవిక్రుపచేత। వాణితో వాణిపాదాముబట్టి- పానాము జేసితి పాదారగుళ్ళరసము॥ ఆనం॥ కాముస్త్రీ లక్ష్మిపుత్రుడు- సోమధరుని ప్రేమభక్తుడు। నామమహాత్మ్యముచే యీమహాత్మ్యముగల్గె- నామధేయుడు సుబ్బయ్య స్వామిక్రుపజెందె॥ ఆనం॥

ఆనందభైరవిరాగం—ఝంపతాళం

(35) జయమంగళం నిత్యశుభమంగళం। జయాజయమంగళం మహిమాత్సవమంగళం॥ ప॥ జయరామసుతునకు జయకల్పభూజునకు। జయమనుచు మమ్ముబ్రోచు జగజ్జననికి। జయమనుచు పాడితిని భక్తులకు ముక్తులకు। జయమనుచుపాడితిని జగములకును॥ జయ॥ పార్వతీలోలునకు తరమకళ్యాణునకు। సూరిజనపాలునకు సుగుణాత్మకు। నేరమెంచక వేమారు బ్రోచెతండ్రి। తీయగానాహృదయలింగమునకూ॥ జయ॥ వారిజానేత్రునకు వైకుంఠహితునకును మారవైరికి జ్ఞానమహితునకును। సారెసారెకునాదుసౌఖ్యముదుగ్గుచునున్న నీరజాక్షీ పార్వతమ్మకిపుడూ॥ జయ॥ కామర్షి సుబ్బయ్య కవితకల్పన చేయ సోమధరునామమే వేరుకాదు। ప్రేమతోసవరించ సోమధరుడేకాని కాములెవ్వరుతప్ప కానలేరూ॥ జయ॥

శహనరాగం—ఆదితాళం

(36) కర్పూరానీరాజనమివ్వరే - ఒప్పగశ్రీగిరినాథునకు నేర్పుమీరగపాటలుపాడరే - నీరజాక్షిశ్రీపార్వతికి॥ ప॥ తప్పులేనిది అప్పులేనిది ముప్పులేనిదౌకరహస్యము। యిప్పుడే నేర్పులో ఒప్పగనరె - చెప్పరానికష్టముదీరునె॥ కర్పూర॥ దర్పములణచి అర్పణఫలములు నేర్పుమీరనర్పింపరే। తర్పణవిడువరె సర్వాంగమునీకర్పణమనీ సేవించరే॥ కర్పూర॥ సోమధరానీనామమహాత్యము కామర్షి సుబ్బయ్యదెల్పెను। భూమాజగతిలోనీనుమెరింగిన ప్రేమామీరపరగునదె సౌఖ్యము॥ కర్పూర॥

నాదనామక్రియ—అటతాళం

(37) హారతిపార్వతికి- శృంగారవతికి హారతి పార్వతికి॥ ప॥ సూరిజనాపాలినికి- వారిజాక్షికి మారవైరికి॥ హారతి। ధీయని

రాణికి ధీరునకూ- వారిజాక్షికీ నగధరునకును ॥ హారతి ॥ గంగకు గౌరికి అంగజవైరికి- రంగనాథసహోదరికీ ॥ హారతి ॥ కుంభినీశ్వరికి శంభునకు- శంబుకంఠికి అంబికేశునకు ॥ హారతి ॥ కామర్షి సుబ్బయ్య నేలిన- సోమధరునకు భామామణికి ॥ హారతి ॥

నాదనామక్రియ రాగం—ఆటతాళం

(38) శ్రీవాణిదేవికి హారతి । శ్రీఅజునీరాణికి శ్రీవాణిదేవికి హారతి ॥ ప ॥ పాలిని కోపిని వరమనీచుని- కాపాడిన నాకన్నతల్లికి శ్రీ ॥ శ్రీకరంబుగా నాకరములతో- ఆకారముగని హారతిచ్చెద ॥ శ్రీ ॥ భక్తపాలినికి ముక్తికాంతకు- రిత్తైలబ్రోచే శక్తిరూపిణికి ॥ శ్రీ దిద్దితీర్చినను హద్దునపెట్టియు- సిద్ధునిచేసిన పరిశుద్ధాత్మకు ॥ శ్రీ ॥ కామర్షి సుబ్బయ్యనేలిన- సోమధరార్చితభామామణికి ॥ శ్రీ ॥

మధ్యమావతి—ఆటతాళం

(39) లాలిపార్వతినాథ భక్తవినోదా - లాలియని యూచేను సర్వాత్మనాథా ॥ లాలి ॥ బాలీసుముఖులు శాలువలు బరచి డోలికలోనిన్ను శయనింపచేసి ॥ లా ॥ ఫాలభాగములందు బాలతో గూడి- వాలలాడుచునన్న లీలాస్వరూపా ॥ లాలీ ॥ చంద్రధర ఇంద్రధర సుందరీమారా । బృందారకార్యహర వందనపుహరా ॥ లాలీ ॥ మంచెమీదను పంచాక్షరీతల్పం- పంచభూతాత్మ శయనించు సుఖకల్పం ॥ లాలీ ॥ పంచియిరువైయయిదు తత్వములు మంచి- దూలామునందున గొలుసులుగనుంచి ॥ లాలీ ॥ పంచముద్రలుబట్టి పొంచిద్వారమున- కంచశరునిగొట్టి కాంచె సుబ్బయ్య॥ లాలీ ॥

మధ్యమావతిరాగం—అటతాళం

(40) జోలయనిపాడెదను పార్వతీలోలా- చాలనీనువేడెద నుభక్తపరిపాలా ॥ జోజో ॥ ఫాలభాగమునందు వాలలాడుచును - చాలగాభక్తులకు కీలుదెల్పుచునూ ॥ జోజో ॥ భజనచేయుచునుం డు అజనుతానీకు- భుజనాత్మహృదయ- తల్పమునశయనించు ॥ జోజో ॥ విరివిగాసురులంత మురలుబెట్టగను- వరములొసగివేగ శయనించె హరుడూ ॥ జోజో ॥ నమ్మినభక్తులను నమ్మితివితంద్రి యిమ్ముగనీక్రుతను ఇమ్మితివితంద్రి ॥ జోజో ॥ సామగానలోల స్వామిభక్తపరిపాల- సోమధర సుబ్బయను ప్రేమతోనేలా ॥ జో॥

మధ్యమావతి—అటతాళం

(41) జోలయనిపాడేను చాలవేడేను- బాలనాహృదయత ల్పమున శయనించు ॥ జో ॥ అంబశాంభవిరావే కనకపద్మాంబ కంబుకంఠీ కమలమందుశయినించూ ॥ జో ॥ తుంబురనారదులుగా నంబుసేయా- రంభకుంభహారతి అంబనీకియ్యా ॥ జో ॥ చాల్లలోబ యిలుదూలమునవేయ్యాల- జోడుత్రాళ్లనుగట్టి కీలుగనిపెట్టి ॥ జో ॥ వాలలాడుచుచాల యాలబాడుచునూ । ఫాలమున సుబ్బయ్య యూ చెనుయాల్యా ॥ జో ॥

మధ్యమావతిరాగం—అటతాళం

(42) జోలయనిపాడేను ఫాలభాగమున - వాలలాడుచేను న న్నువాణిదేవికిని ॥ జో ॥ చాలగానావయిని జాలినాతల్లి - నాల నావాక్కునగ వసించుతల్లి ॥ జో ॥ అఖిలాని హృదయతల్ప మునశయనించు భుజగభూషణునితో భజనసేయుదును ॥ జో ॥ న మ్మినసుబ్బయ్యకు నమ్మతిగకొమ్మా- యిమ్ముగనీకరుణ చిమ్మితివి సుమ్మా ॥ జో ॥

భూపాళ.

(43) మేలుకొనవే ఫాలలోచన మేలుకొనవే భక్తపాలన- చాలగానిను వేడుచుంటిని- నీలకంఠా పార్వతీశా ॥ మే ॥ కాలబంధములోనుజిక్కి- తాళజాలకనిన్ను వేడితి- చాలునాకిక జన్మసౌఖ్యము కీలుదెల్పుము ఫాలమందు ॥ మే ॥ తెల్లవారెను కల్లవనులకు కల్లభానుడుదయమాయెను। మల్లెగుంతలు చాలునాకిక మర్త్యజన్మము లొద్దుతండ్రి- కల్లమూలము గాన లేక తొల్లినేనిజన్మమెత్తితి- యుల్లమందున తల్లడిల్లితి చల్లగాబ్రోవల్లరాయా। మే ॥ యిల్లుకల్లా యొడలుగుల్లా యుల్లమందున తలపులిల్లా। యుల్లమెరిగిన సుబ్బయాఖ్యుని అల్లగురునిబ్రోవుమజల్లా ॥ మేలుకొనవే

మేలుకొలుపు భూపాళ.

(44) మేలుకొనవే లీలుగనవే కాలునిదూతలుగాచిరి। చాలగ్యాగుమబోధనమ్మి ఫాలమందునజూడవే జీవా ॥ మే ॥ ఆలుబిడ్డల నమ్మకమున మాలినామము చాలనమ్ము। మాలిమెవ్వరు లేరుచూడు వనమాలినామమె తోడునీకు ॥ మే ॥ చాలగాధనమార్జించితే మాలిమైయుందురు- అంతరువీలుతప్పితే గేలిమాటలు చేళనాజేతురునిను చాలా ॥ మే ॥ కాలునైనా నమ్మవచ్చును కలనుబ్రహ్మారులనమ్మరాదు। పాలనుసేయుము చంద్రశాలచేరికనూ ॥ మే ॥ కీలుతెలుసుకో ఫాలమందున వాలపాడుచునుండు బాలతో చాలగా సుబ్బయ్యనేరిన మేలుగురునిచూడు ॥ మే ॥

శ్రీవాణిదేవివరిపూర్ణకటాక్షమువల్లను

సోమధరనామావళి

సంపూర్ణము

# ☞ విజ్ఞాపన. ☜

———:0:———

ఈగ్రంథకర్తచేత (1) పరతత్వబోధామృతకీర్తనలు(2) శ్రీకృష్ణలీలామృతసారసంగ్రహము అనుపేర్లుగలమరిరెండుగ్రంథములు రచియింపబడి అచ్చునకుసిద్ధముగానున్నవి. ఈగ్రంథకర్త ద్రవ్యవంతుఁడు కానందున బహుధార్మికజనసహాయమునపేక్షించి అట్టియాచనద్రవ్యమూలముగ క్రమక్రమముగా నొకటొకటి వంతున ముద్రింపవలెనని యున్నాఁడు.

చిత్తగించవలెను.

బందరు
రాజుపేట }

ఇట్లు సుజనవిధేయుఁడు;
కామర్తి సుబ్బయ్యదాస్

